బాలికల ఉన్నత పాఠశాల
ప్రచురములు
౩

# భారతీ నక్షత్రమాల

కవయిత్రి

శ్రీమతి

## యస్. భారతీరత్నాకరాంబ

(ప్రిమెట్రికు)
బాలికల ఉన్నత పాఠశాల,
౪౩ లక్ష్మీవిలాస్, సుల్తాన్‌బజారు, హైదరాబాదు.

పరిష్కర్త:
బిదురు వేంకట శేషయ్య, బి. ఏ.

బాలికల ఉన్నత పాఠశాలా

# ప్రచురణలు

---

మాతృభారతి మొదటి సంపుటము ... ... ౧-౮-౦

,, రెండవ సంపుటము ... ... ౦-౮-౦

పండిత కేశవరావుగారి జీవితచరిత్రము

ఘోషయాత్ర (నాటిక)

భారతీ నక్షత్రమాలిక

నిర్మల




రసజ్ఞులగు మహాశయులకు మనవి:—

ఈ గ్రంథకర్త్రి శ్రీమతి. యస్. భారతీరత్నాకరాంబ. బాలికల ఉన్నత పాఠశాలలోని ప్రిమెట్రిక్ విద్యార్థిని. ఈ సంవత్సరమే నాయొద్దఁ గొలఁదిగఁ బద్యములల్లుట నేర్చుకొన్నది. తత్ఫలమే యీ భారతీనక్షత్రమాలిక.

భారతీనక్షత్రమాలిక యిరువదేఁడు పద్యములు గలది. శైలిలోఁ బూర్వపు శతకరాజములను బోలినది. కవయిత్రి పదుమూఁడేండ్ల బాలికయయ్యును, ప్రతిభాశాలినియని యనిపింపఁదగిన పద్యములును గలవు. భావనూత్నత దీనియందంతఁగఁ జూపట్టకున్నను, (అది యిట్టి గ్రంథమునఁగూడ గమనింపఁదగినదేనా?) వఱుగు విఱుగులేని ధారాశుద్ధిగల మధురకవితా ప్రవాహముతో మాన్యమై యలరారుచున్నదని చెప్ప సాహసించినచో, నది గుణశ్లాఘామాత్ర పరముగనేగాని, యన్యథాతలంప కుందురుగాక!

ఇంతచిన్న వయస్సుననే యిట్టి పురోభివృద్ధిసూచకమగు గ్రంథనిర్మాణమునకుఁ గడంగిన మా భారతి, జీవితరంగమునఁ బ్రవేశించినను దత్సన్నివేశములకు జంకక, యితోధిక గ్రంథరాజములను విరచించి

యాంధ్రభారతీ సేవనొనరించి. మాకును, దనకును, దేశమునకును గౌరవముఁదెచ్చి, "ముదితల్ నేర్వఁగరానివిద్దగలదే? ముద్దార నేర్పించినన్!" అను సూక్తిని ప్రత్యక్షర సత్యముచేసి, నిర్మల యశశ్శోభావతి యగుఁగాక యనియు, నామె యీ గ్రంథరచన మితరబాలికలకుఁ గూడ మార్గదర్శకమయి, పాఠశాలకు వన్నె దెచ్చును గాకయనియు, హృదయపూర్వకముగ నాశీర్వదించుచు, నింతటితో విరమించుచున్నాను.

ఇట్లు బుధవిధేయుఁడు,

బిదురు వేంకటశేషయ్య, బి, ఏ.



# అంకితము



శ్రీరామా! సురపూజితా! గుణనిధీ!
సీతామనోనాయకా!
కారుణ్యాలయ! భక్తసంభరణా! ఓ!
కాకుత్స్థవంశోత్తమా!
నీరేజేక్షణ! గ్రంథమంకితముగా!
నీకిచ్చుచున్నాను; గై!
కో రాజత్కృపతోడ, దైత్యమథనా!
గోపాలనాథాగ్రణీ!

— శ్రీమతి నేమాని భారతీరత్నాకరాంబ.

శ్రీ

# భారతీ నక్షత్రమాలిక



శ్రీ రమణీ మనోహరుని
చిన్నరి కోడలవైన నిన్ను హృ
త్సారసమందు నిల్పుకొని
సంతతమున్ భజియించి తావకో
దార కృపా ప్రసాదములఁ
దప్పక వాంఛిత సిద్ధిఁగాంచి, త
ల్లీ! రసనాగ్రనర్తకి! య
హీనగతిన్ జరియింతు, భారతీ!

ఉ॥ విద్దెలకెల్ల మూలమని
విశ్వపితామహురాణి! నిన్ను నేఁ
బెద్దఁగఁజేసి వేడితినిఁ
బ్రేమము మీఱఁగ విద్య నీయుమా!
కొద్దిగఁ జాలు; నింక మఱి
కోరను నిన్ను; నిజమ్ము సుమ్ము, నే
నెద్దియు జాల మేలనిఁక
నిత్తఱి నన్ గృపఁ జూడు, భారతీ!




ఉ॥ పాపవినాశినీ ! పరమ
పావని! పుస్తకపా[ణి]! వాణి! నా
పాపములెల్లఁ బాపి ననుఁ
బాయని నీకృప కర్హఁ జేయగా
నీ పద పంకజంబులను
నెమ్మనమందున నిల్పి, నీవె మా
ప్రాపవటంచు వేడితి, న
పారకృపామతి! నిన్ను భారతీ !

ఉ॥ పామరు లెందఱో పరమ
పావనమంచు ననేకక్షేత్రముల్
ఏమరకుండ ద్రిమ్మరుచు
నెంతురు పాపము డాయదంచుఁ, దా
మే మఱి పుణ్యులంచు మది;
మీనవిలోచన! కాని యట్టిరున్
గోమలి ! నిన్నుఁ గొల్వకయ
కోరదు స్వర్గ సుఖంబు, భారతీ !

ఉ॥ ధనము గలాఁడనంచుఁ, గడు
దర్పముగల్గు నశేష శేముషీ
ఘనుఁడ నటంచు నెంతయును
గర్వితుఁడౌ నరు వృత్తమీయిలం
గనుఁగొన రిత్తయౌను; హరి
గాదిలి కోడల! పుణ్యశీల! నిన్

మనమునఁ గొల్వకెద్దియు ఘ
నంబుగ భాసిలఁబోదు, భారతీ !

ఉ॥ పేదలయందు నెల్లప్పుడు
ప్రేమ నివిష్టమొనర్చు నేతకున్
సాధులపైని మన్ననకు
సత్యము మున్నగు సద్గుణాళికిన్
బోధనసమృద్ధి కంతటికిఁ
బుట్టిన యిల్లని, పూర్వుఁబోణి, నీ
పాదయుగం బెఱుంగ రిలఁ
జామరవారము సుమ్ము, భారతీ!

ఉ॥ ఈ మహి నెందఁ జేని మతి
హీనులు దేహము శాశ్వతంబుగా
నేమియు శంకలేని యటు
లెంచెద రెంతయు, నట్టివారి నో
భామిని ! నే నొకర్తనయి
వర్తిలు చుండితి నింతదాక; నీ
కామితదాయకం బయిన
జ్ఞానలవం బెపుడిత్తు ? భారతీ!

శా॥ కాషాయాంబరముల్ ధరించియును దాఁ
గాయమ్మునై భూతినిన్
వేషాలంకృతికై యలందియును, తీ
విం గూర్చు దండమ్ము నో

భాషాభామిని ! కేలఁ బూనుచుఁ గడున్
వర్తించు మాయావులన్
ఈ మన్మాత్రము తాపసేంద్రులన నౌ
నే ? సన్మతీ ! భారతీ !

ఉ॥ సర్వము నేనె చేయుటకుఁ
జాలుదు నంచుఁ దలంచువాని, కీ
యుర్విని దేవుఁడెల్లెడల
నుండుట కల్ల యటన్నవానికిన్
ఒర్వమునందు నైన నినుఁ
భావము సేయనివానికిం, గడుం
గర్వితుఁ డైన వానికిని
గల్గునె సత్యసుఖంబు, భారతీ!

ఉ॥ వ్రతములవెల్లఁ గల్లగని
రాదరణం బొనగించుచున్న వా
రతులితమాధురీకలిత
మైన పురాణకథార్థజాలముల్
సతతము మాని, నాటకము
లన్ నవలల్ పఠియించుకొంచుఁ దా
రతివలు; వారి యజ్ఞతను
నావలఁ ద్రోయుము, తల్లి! భారతీ!

ఉ॥ దానము లెన్నఁడో సురిగె
దైవము నందలి భక్తి తగ్గె; స

నా స్మనితకార్యమందలి మ
మత్వము పూర్ణముగా సమించె; నో
మానిని! ధ్యానపావనస
మాధివిధానులు వానులాటలుం
గానఁగ రావవెవ్వియును
గాలవశంబున నిష్ఠు, భారతీ!

ఉ॥ ఆంధ్రమె సర్వభాషల, ను
దంచిత సత్కవితా ప్రసక్తికిం
గేంద్ర మటంచు నెల్లరును
నిన్నె భజించి యజించు వేళలన్
సాంద్రముగాఁగఁ బర్వెతి య
శంబును బూర్వ; ముపేంద్రతుల్య రా
జేంద్రుల యాదరంబునఁ; గృ
శించితి వీవెడ, నాంధ్ర భారతీ!

ఉ॥ ఓరిమి కూరుముల్ దొఱఁగి
యొండొరులందు నసూయ పెంపునన్
మేరకుమించు లాభముల
మేమె గడింపఁగ నేర్పుకావలెం
బారము లేని నష్టము లె
వ్వారికిఁ గల్గినసైన నంచు లోఁ
గోరుదు రమ్మ! కొంద ఱతి
ఘోరపు వాంఛలు; తీర్తె? భారతీ!

ఉ॥ సారము లేని యట్టియు, న
శాశ్వతమైనది యైన యట్టి, ని
ష్కారణమైన యట్టి, భవ
సాగరమందు మునింగి తేలుచుం
దీరముఁ గాన లేక బహు
దీనత నొందుదు మర్త్యకాలముం
జేరఁగవచ్చు పట్టున, న
శేష వ్యథాతురవృత్తి, భారతీ!

ఉ॥ ఆశయె సర్వపాపముల
కంచిత మూలమగుం ధరిత్రిపై
నాశయె సర్వకష్టముల
కారయఁ గారణ; మాశఁగూడి యా
వేశముచేతఁ జిందులను వేయుచు
వర్తిలుచున్న వార- మీ
యాశను బాఱఁద్రోలి మము
నార్తులఁ బ్రోవుము, మాత! భారతీ!

చం॥ ధనమును రాజ్యమున్నదని
దర్పమునొందెద; రంతెకాని, యా
ధనమును- రాజ్యమున్ యముని
దాపునకున్ వెనువెంట రావు; మా
వెనుక యశంబొకండెగద
వీడకవచ్చుట? ఆ యశంబు నిన్

ఘనముగఁ గొల్చుటం గలుగుఁ
గాదె? చతుర్ముఖురాణి! భారతీ!

చం॥ ఘన కరుణావిశేషమునఁ
గల్పన చేసెను భేదపద్ధతుల్
మనుజమృగంబులందు విధి,
మానిని! అట్టిది సార్థకంబుగాఁ
దనరఁ జరింపఁగా వలయు
ధారుణి,నంతియెగాని లేనిచో
మనుఁజుడు రెండుకాళ్ళ కసు
మాలపు జంతువె కాదె, భారతీ!

మ॥ సురపూజ్యుండగు నా చతుర్ముఖునకున్
సొంపారు నర్ధాంగివై
సిరికిన్ మేల్మరిపెంపుఁ గోడలవునై
చెల్వొందుచున్ నీవు భా
సురలీలం గమలాసనంబునఁ గళా
శోభం బ్రవర్తింతు! నీ
సరి యెవ్వారు? వచింపు! మార్తజన ర
క్షా దీక్ష నో భారతీ!

చం॥ తెలుచు భవత్ప్రభావమును
దామెయెఱుంగరు; పో! యెఱింగినన్
దొరకొని నీతి మూఢులకుఁ
దోఁపఁగఁజేయ రసూయఁ బండితుల్

విరివిగ వేదశాస్త్రములు
విప్పివచింపవు నిన్ను గూర్చి; యి
ద్ధర నీక నిన్నుతింప నగు
ధన్యపథం బది యేది ? భారతీ!

మ॥ నిరయంబైన నిజమ్మనే పలుకు సౌ
శీల్యంబువా; రెంతయున్
గరుణంగూలుచు సర్వజీవుల యెడన్
వర్తించు శిష్టాత్మకుల్
పరచింతన్ దినముల్ వ్యయించెడి మహా
భక్తోత్తముల్ నేడయో!
అరయం గంటికిఁ గానరారు గద! ఏ
మన్యాయమో భారతీ!

ఉ॥ పోతన కాళిదాసు భవ
భూతియు, నన్నయ తిక్కనాది వి
ఖ్యాత కవీంద్రశేఖరులు
గారవమొందిరి నిన్ను సద్గుణ
స్ఫీతను మాతగాఁ దలఁచి
సేవలొనర్చుటఁ జేసి, యట్లు ని
న్నాతగలేనివార లెటు
లొందుదు రిద్ధయశంబు, భారతీ!

మ॥ పరదేశాగతమైన నాగరకతల్
పాటించి జాతీయతన్

వెరపింతేనియు లేక మా పడఁతుకల్
విద్యావతీరత్నముల్
ధరపాల్ చేయుచు నున్నవారలుగదా!
దాక్షిణ్య పుణ్యాత్మలై
తరుణీ! వారలకిచ్చి ప్రోవుము స్వజా
త్యాసక్తి నిన్, భారతీ!

శా॥ జాతీయత్వము, దేశభక్తి, స్వమతా
చారాభిలాషంబునుం
బాతివ్రత్యము, సత్ప్రవర్తనమునున్
సర్వాదరస్థానమౌ
నీతిన్ గార్యములందు శ్రద్ధయెదలో
నిండారుటన్ మాపయిన్
బ్రీతింజేసి యొసంగ వేడెదను ద
ల్లీ! నిత్యమున్ భారతీ!

మ॥ సిరి నర్థాంగిగఁ గల్గి యాశ్రితులకుం
జింతామణీరూపుఁడై
హరికిన్ ముద్దుల కోడలై నడచి యా
హ్లాదమ్ముఁ గల్పించుచున్
సరసీజాసనుఁ డిచ్చ మెచ్చునటులన్
సద్వృత్తిఁ గై సేయుచున్

భా ర తీ న క్ష త్ర మా లి క

గగనారూపిణివైన నీ ప్రభ నెఱుం

గ న్నేర్తుమే భారతీ!



ఉ॥ నాకొకఁబంత యేర్పడిన

నవ్యకవిత్వపుధారతోడుతన్

నీకుం గృతజ్ఞతం దెలుప

నేర్చువిధంబున జిన్ని పొత్తమున్

దేకువ వ్రాసి, యర్పణవి

ధిం బచరింతును భక్తరక్షణ

శ్లోకుండు రామచంద్రునికి

లోలవిలోచన! భవ్యభారతీ!

శా॥ వీణాపాణి! స్వయంభురాణి! సుమనో

విఖ్యాతవిద్యాధర

శ్రేణీమానితమంజువాణి! రమణీ

శ్రేయోఽను సంధాయినీ!

వాణీ! పల్లవపాణి! నెమ్మదిని నీ

వారంచు భావించుచున్

ఏణీలోచన! మమ్ము బ్రోవఁగదవే?

ఎల్లప్పుడున్, భారతీ!

చం॥ ఇరువదియేడు పద్యముల

నింపుదలిర్పఁగ ముందుముందుగా

విరచనఁజేసి సౌరభపు
వెల్లువనించెడి మాలగట్టి శ్రీ
చరణసరోజసీమనిడి
సంతస మగ్గలమై రహింపఁగాఁ
జరితచరిత్రనైతి జుమి,
చారుగుణోన్నతి! మాతృభారతీ!

ఇది భారతీలబ్ధకవితాధారాకదంబ యగు
శ్రీ నేమాని భారతీ రత్నాకరాంబచే
రచియింపఁబడి శ్రీరామచంద్రుని
కంకిత మీయఁబడిన
భారతీనక్షత్రమాలిక
సమాప్తము.

